# గ్రంథాలయ సర్వస్వము.

సంపు. ౭ ॥ బెజవాడ - ఏప్రిల్ ౧౯౨౯. | సంచిక. ౧౦

## గ్రంథాలయాదర్శము



కుక్కునూరునందున్న

శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషానిలయ వార్షికోత్సవ సందర్భమున

శ్రీ చెరుకుపల్లి బుచ్చిరామయ్యగారిచే

నొసంగబడిన అధ్యక్షోపన్యాసము.

పూర్వకాలమున మన దేశమందంతటను విద్యావ్యాపకము ఆచార్యులవలనను అంతేవాసులమూలమునను జరుగుచుండెడిది. అట్టి యాచార్యు లున్నచో వేరే గ్రంథాలయావశ్యకతయే లేదు. ఆచార్యులే చరమరూపమున నుండు గ్రంథాలయము లనవచ్చును అనేక గ్రంథములను ఆచార్యులు ధారణజేసి యుండెడివారు. ఏ విషయము కావలసియున్నను వారివలన వినవచ్చును. వేద వేదాంగములు మొదలు సమస్త గ్రంథములలో నుండు విషయములు వారి ముఖమున తెలియ నవకాశము లుండెడివి. కావున అట్టి యాచార్యులను పోషించి వారి సపర్యలజేయుట గ్రామస్థుల విధ్యుక్త ధర్మమని యెంచెడివారు. అట్టి యాచార్యు లుండుకాలమున ఆచార్యగృహమే విద్యాలయము. ఆచార్యులే గ్రంథాలయము. అంతేవాసులే విద్యార్థులు. ఇంటివార లందరు గృహకృత్యములైన తరువాత నొకచో కూర్చుండి ఇహపర సుఖసాధనముల గూర్చి ముచ్చటించుచుండెడివారు. లేదా పురాణములు పఠించెడివారు. అవియే సభలు. ఇందు స్త్రీలు పురుషులు పాల్గొను

చూచువారు. కొందఱు స్త్రీలు ప్రత్యేకము విద్య నభ్యసించెడివారు. కొందఱు విద్య నభ్యసింపకపోయినను శ్రవణము చేతనే విద్యావిషయముల దెలిసికొని వివేకవృద్ధి గావించుకొనుచుండెడివారు. బృహదారణ్యకమున వినబడు గార్గి, మైత్రేయి మున్నగు విదుషీమణులచరిత్రములే ఇందుకు తార్కాణము.

ఆకాలమునకు తర్వాత క్రమముగ దేశమున మార్పులు గానపించెను. క్రమక్రమముగ నా కట్టుబాట్లు సడలెను. ఆచార్యు లరుదైరి. అంతేవాసులంతకన్న నరుదైరి. కావున చరమరూపమున నుండు గ్రంథాలయములు స్థిరరూపము దాల్చవలసివచ్చెను. ఋషులయనుభవములు, విద్యావిధానములు, చర్చలు, ప్రయోజనములు, గ్రంథస్థములు చేయబడెను. ఋషుల మొదలు కొంతకాలము క్రిందటివరకు గ్రంథరచనమన్న చాల భయపడువారు. ఏకదీక్షతో నొక్కొక్కరు తన జీవితమంతయు గ్రంథరచనమున వినియోగించెడివారు. ఒకరు గ్రామమున రోళ్ళవద్ద పడిన కణములు భుజించి తర్కశాస్త్రమును రచించెనట. ఇంకొకరు నీరు త్రాగుచు గ్రంథముల రచించెనట. వేరొకరు వాయుభక్షణమాత్రము జేయుచు గ్రంథములు రచించిరట. వాచస్పతిమిశ్రులను నొక పండితులుండెడివారు. కాళిదాసాది సంస్కృతకవులు, నన్నయ తిక్కన పెద్దన పోతనాది యాంధ్రకవులు, మొదలగు పండితులెంతెంత శ్రమపడి గ్రంథములు రచించిరో చూడుడు. మహామహులు రచించిన గ్రంథము లపూర్వయనుభవములతో నిండినవి. ఇట్టి గ్రంథములు చేర్చియుంచినవి గ్రంథాలయములు. గ్రంథాలయములు కేవల గ్రంథముల సమకూర్చిన సప్ప్రయోజనము. త్రిపుటి కావలయు. గ్రంథములు ప్రజలు చదువు త్రిపుటి. గ్రంథము లున్నను లాభము లేదు. ప్రజ లున్నను లాభము లేదు. గ్రంథములను చదువరులు చదివి, వానియందున్న యమూల్యోపదేశముల దెలిసికొని, ఆయాదేశము ననుసరించి,

తమతమ వర్తనముల సవరించుకొనవలయును. మన వర్తనములు చిత్తములయందుండు పూర్వవాసనల ననుసరించి నడుచుచుండును. పూర్వవాసనలు సువాసనలు, దుర్వాసనలు అని రెండువిధములు. దుర్వాసనలను దహించవలయును. సువాసనలను వృద్ధినొందించవలయును. అయ్యది గ్రంథపఠనమువల్లను, సత్సంగమువల్లను సులభము. మనసంఘ మీకాలమున ననేక బాధల నొందుచున్న మాట వాస్తవమే. కాని బాధల తొలగించుకొనుటకు వివేకాభివృద్ధి కావలయును. వివేకమను వెలుగుతో విమర్శించ వలయును. శాస్త్రీయాచారము లన్నంతనే మూఢాచారము లని యులికిపడ నక్కరలేదు హేతువులు దొరకుట లేదుగనుక మే మాచరించ మన నక్కరలేదు. ఆర్షేయ గ్రంథముల జెప్పబడిన నుడువులు అనుభవపూర్వకములైనవి. అతీంద్రియజ్ఞానగమ్యములు. శ్రుతిస్మృతి చోదితములు. ఆయా దేశములకు హేతువులు కన్పడవచ్చును. కన్పడకపోవచ్చును. హేతువిమర్శనము విపరీత పరిస్థితులలో దింపును. సన్నిపాత జ్వరపీడితుడగువాడు మందు పుచ్చుకొనుమన్న - మం దేమిటి, యేపదార్థములతో జేసినారు, ఎట్లు పని చేయును, శరీరతత్వమేమి, ఏ పదార్థ మేధాతువుపై పనిచేయును? అని విమర్శింప నారంభింప నతనికి శారీరశాస్త్రము, వైద్యశాస్త్రము బోధపడుట యెప్పుడు? విశ్వాసము కలుగుట యెప్పుడు? ఔషధము సేవించుట యెప్పుడు? ఆరోగ్యవంతుడగుట యెప్పుడు? మనయాచారముల గూర్చి విమర్శించుటయు నిట్టిదియే యగును. అన్నిటికిని హేతువులు కలవు. అన్నిటివలనను లాభములు కలవు. అన్నియును మన శ్రేయస్సును గూర్చి నియమింప బడినవే. కావున వివేకముతో మెలగవలయు. సంఘమంతయు సంకటస్థితియందున్నది పూర్వపు ఔన్నత్యము మరచితిమి. భావ్యౌన్నత్యము గోచరించుటలేదు. సాధనములనేకములై సాధకులమనంబుల ప్రమాదము నొందించుచున్నవి. ఈ దేశపు టరణ్యమార్గములవలె, కొన్ని గహనారణ్యములోకి జేర్చును. కొన్ని భయంకర మృగముల కెదుట నిల్చును. కొన్ని తస్కరులుండు

పరదేశములలో ప్రవేశపెట్టును. కొన్ని ఎంతతిరిగినను గమ్యస్థానమునకు జేర్చనే లేవు. ఇట్టున్న సాధనములలో నేది పరమానందము జేర్చునో యోజించుటకు వివేకము కావలయు. వివేకము విద్యవలన కలుగును. విద్య సంకల్పముచే నారబ్ధమై ఆచార్యోపదేశముచే నభివృద్ధమై సత్సంగముచే వృద్ధినొంది, సంఘసేవచే ప్రకాశించి, భగవదారాధనచే ప్రజ్వలించి యజ్ఞానధ్వాంతము నంతమొందించును. కావున నట్టి విద్యావ్యాపనముకొరకై యారంభింపబడిన యీ భాషానిలయము సజ్జనులచే పోషింపబడతగినది. ఏ సంస్థయైనను ఒక వ్యక్తిసంకల్పముచే నారంభింపబడును. ఆవ్యక్తి సౌజన్యాదులే యితరులసాయమును నాకర్షించును. ఆసాయమువలన కలిగిన బలముచే సంస్థ నిర్వహింపబడును. ఏసంస్థ ఏదేశమున ఏకాలమున నిర్వహింపబడునో ఆదేశము కాలము ప్రజలు మొదలగు పరిస్థితుల ననుసరించి నిర్వహింప బడవలయును. ఇక్కడి పరిస్థితులు మీకే బాగుగ తెలిసియున్నవి. దేశమున నితర భాగములకంటె నీ ప్రాంతము విశేషించి వెనుక బడియున్న దనుట నిర్వివాదాంశము అయినను యిట్టిస్థలమున నీ సంస్థను పోషించుట యాశ్చర్యమే. దీనికి స్థిరభవనము, స్థిరవసతి యేర్పడవలసియున్నది.

మీసంస్థకు మీరు సాయపడుదురేని యితరులు సాయపడుదురు. పూర్వము గ్రంథాలయములు దేవాలయములందుంచెడివారు. 'శివపుస్తకనిక్షేపః బహుపుణ్యఫలప్రదః' అని సూతసంహితాది గ్రంథములయందు జెప్పబడియున్నది. పుస్తకదానము జ్ఞానదాయక మని స్మృతులు బల్కుచున్నవి. కావున పుస్తకముల నింపుడు. భవననిర్మాణమునకు తోడ్పడుడు. గ్రంథముల పఠించుడు. వార్తాపత్రికల శీలింపుడు. వివేక మార్జింపుడు. జ్ఞానులు కండు. సుఖింపుడు.

శ్లో॥ ఘృతమివపయసి నిగూఢం। భూతేభూతేచ వసతివిజ్ఞానం।
సతతంమంథయితవ్యం । మనసా మంథానభూతేన॥

# హెర్బర్టు హౌవరు.

అమెరికా దేశమందు గ్రంథాలయోద్యమమునకై విశేష పరిశ్రమ జేసినవారిలో హెర్బర్టుహౌవరు అను మహనీయు లొకరు. ఆయన ౧౮౯౫వ సంవత్సరమున స్టేన్‌ఫోర్డు విశ్వవిద్యాలయమందు పట్టపరీక్షయం దుత్తీర్ణు డాయెను. ఆ ... నవృత్తి గనులయింజనీరుపని. బీదలకు సహాయము జేయుపనియం దాయనకు ప్రీతి మెండు. ఇంకను ప్రజోపయోగములగు పెక్కు కార్యములం దాయన ఎక్కువశ్రద్ధను దీసికొనుచుండెను. ఇన్ని పనులున్నను, గ్రంథసమీకరణమందును, గ్రంథాలయాభివృద్ధియందును ఆయనకున్న ఆసక్తి అసమానము. అపూర్వగ్రంథములు కావలసిన పరిశోధకులకు ఆయన చేసిన సహాయము వర్ణనాతీతము.

ఆయన చైనాదేశమం దున్నప్పుడు ఆదేశచరిత్రకు సంబంధించిన వాఙ్మయము బహుస్వల్పముగా నున్నసంగతిని గుర్తించి, దానికి కావలసిన సాధనసామగ్రినంతను విశేష వ్యయప్రయాసలకు లోనై సేకరించి, పిమ్మట దానినంతను "స్టాన్‌ఫోర్డు" విశ్వవిద్యాలయ గ్రంథాలయమున కొసంగెను. ఆయన సేకరించిన సాధనసామాగ్రి అమూల్యమగు పరిశోధనకు ప్రాతిపదిక యయ్యెను.

ఆయన స్వంతగ్రంథాలయమునుకూడ సేకరింప గడంగెను. గనులుత్రవ్వ శాస్త్రము, లోహములకు సంబంధించిన శాస్త్రములకు సంబంధించిన అనేక అమూల్యగ్రంథములను ఆయన స్వంత గ్రంథాలయమునకు సేకరించెను. అభిమానశాస్త్రమగు గనులుత్రవ్వు విద్యయందు ఆయన పరిపూర్ణ ప్రజ్ఞావంతు డాయెను. "స్వీడనుబర్గు" అను కవివర్యుడు వ్రాసిన వేదాంతగ్రంథములు ప్రసిద్ధములు. కాని ఆకవి గనులుత్రవ్వు విద్యయందును, లోహశాస్త్రమందునుగూడ అధికారి. ఆయనకు తెలిసిన పశ్చిమ, ఉత్తర ఐరోపా దేశమందుగల గనులను గూర్చి తనగ్రంథములందు పలుస్థలములందు వివరించెను. ఈ గనులలో

చాలభాగము అనేక శతాబ్దములనుండి పనిచేయకపోవుటచే మూలబడి పోయినవి. అంతేగాదు. అవి ఎక్కడనున్నవో ఎవ్వరికిని తెలియదు. మన కథానాయకుడగు "హూవరు"గారు "స్వీడనుబర్గు" వ్రాసిన గ్రంథము లన్నిశ్రద్ధతో పరిశీలించి, మూలబడిపోయి అవిఉన్న స్థలముకూడ తెలియబడకఉన్న గనులనన్నిటిని పైకిదీసి, ఆదేశమునకు అనంతమగు మహోపకారమును గలిగించిరి.

హూవరుగారిభార్య భూగర్భశాస్త్రమందు పట్టపరీక్ష నొందెను. లాటిన్ భాషయందు లోహశాస్త్రమునుగూర్చి గల ప్రాచీన ఉద్గ్రంథము నొకదానిని ఆయన తనభార్యసహాయముతో మిక్కిలి పరిశ్రమజేసి భాషాంతరీకరించెను. లండనునందు ప్రకటింపబడిన ఈ భాషాంతరీకరణము ఇప్పుడు అపరూపముగా నున్నది. అయినను పరిశోధకులెల్ల దానికొరకు అత్యాతురులై సంపాదించెదరు. ఆ భాషాంతరీకరణమును ఇప్పుడు జర్మను భాషలోకి పరివర్తింప ప్రయత్నములు జరుగుచున్నవి.

ఆయన అనేక అమూల్య అముద్రిత పండితగ్రంథములను సేకరించి తుదకు "స్టానఫోర్డు" విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు ఇచ్చివేసెను.

ప్రపంచకము నంతను అల్లకల్లోలముజేసిన ఐరోపామహాయుద్ధమునుగూర్చిన పరిశోధక సాధనములన్నియు "స్టాన్ఫోర్డు" విశ్వవిద్యాలయమునం దేర్పరుపబడిన "హూవరు యుద్ధగ్రంథాలయము"నందు గలవు. ఈ గ్రంథాలయమునకు ప్రాతిపదికగ నేర్పడిన పరికరములు సేకరించుటకు రు 1,50,000 లు వ్యయమయ్యెను. యుద్ధసమయమునందు ౬౩ దేశములవారు ప్రకటించిన ప్రకటనములన్నియు ఇందు సేకరింపబడెను. సుప్రసిద్ధ భాషాసేవకు లనేకమంది అపూర్వములగు వ్రాతప్రతులను సేకరించి, ఈ గ్రంథాలయమున కొసంగిరి.

ముద్రిత అముద్రిత గ్రంథములేగాక, యుద్ధసమయమందును, దానికి పూర్వమందును ప్రకటింపబడిన ముఖ్యములగు పత్రికలన్నిటిని ఈ గ్రంథాలయమునకు సేకరించిరి. 1914 సంవత్సరము మొదలు 1919సంవత్సరము వరకుగల యుద్ధమునకు సంబంధించిన గ్రంథములుగాని, కరపత్రములుగాని, పత్రికలుగాని, పండిత వాఙ్మయముగాని, ఈ గ్రంథాలయమందు సంపూర్తిగా గలవు. మరేగ్రంథాలయమందును ఇంతసంపూర్తిగా లేనేలేదని జెప్పవచ్చును. బెల్జియం, ఫ్రాన్సు, జర్మనీ, గ్రేటు బ్రిటను, హాలండు, రష్యా, సిట్జర్లాండు, యునైటెడ్ స్టేట్సు - దేశములందలి ప్రధాననగరములందు ప్రకటింపబడిన దినపత్రికలయొక్క బైండు చేయబడిన సంపుటములన్నియు ఈగ్రంథాలయమందు గలవు.

ఈగ్రంథాలయమందు 65,000 గ్రంథసంపుటములు గలవు. ఇవిగాక పత్రికాసంపుటములును కరపత్రములును గలసి 65,000 ఉండును. ఐరోపా మహాయుద్ధచరిత్రనుగూర్చి పరిశోధన గావింపదలంచినవారెవ్వరైనను ప్రపంచమునందేభాగమునందున్నను ఈ గ్రంథాలయమును దర్శింపక తప్పదు. హూవరు మహాశయుని పరిశ్రమాఫలితమే ఈ గ్రంథాలయమని వేరుగ జెప్పవలెనా! ఆ మహనీయుని నామము తర తరములవరకు వన్నెకెక్కగలదు.

## శ్రీ వాణీవినోద గ్రంథాలయము, మద్రాసు.

౧౯౨౮ సం॥ జనవరినెలయందు ఈ గ్రంథాలయము స్థాపింపబడినది. ౫౦౦ గ్రంథరాజము లున్నవి జార్జిటవునులో గోడవునువీధియందు నెం. 1-34 గు ఇంటియందు పెట్టబడినది.

# బెజవాడ
# శ్రీ రామమోహన ధర్మపుస్తక భాండాగార
## పదునెనిమిదవ వార్షికోత్సవ సమయమున
## చదువబడిన
# ప్రశంసా పద్యములు

మ॥ ఘనవిద్యా విభవాదికంబులను సత్వంబీవు మాకిచ్చు చుం
డిన కాస్కీ, నుకలావిశేషముల బల్ల్శీవిల్ విడంబింపగా
ననువై వాణికివాసమై విబుధశ్లాఘ్యంబైన శ్రీరామమో
హన గ్రంథాలయ మీప్రభావవల నమ్మా! హేమదుర్గాంబికా!

సీ॥ ఏమహామహుని సత్ప్రేమాతిశయమున
గ్రంథాలయమ్ములు ప్రభవహించె
ఏప్రాజ్ఞు దినపతి ప్రకా ప్రబోధంబున
ప్రజల యజ్ఞానంబు బాయుచుండె
ఏ భక్తవర్యుని శ్రీ భారతీసేవ
పండితాళికి మోద భరితమయ్యె
ఏ దానకర్ణు మహోదారమతి సర్వ
సంస్థలు వర్ధిల్ల జాలనేర్చె

గీ॥ అట్టి శ్రీకాశినాథువంశాబ్ధి విధుడు
బుధుడు నాగేశ్వరుండు సమ్మోదమంది
వచ్చి నీసభ కధ్యక్షపదవి బూనె
రామమోహన లైబ్రరీ నామజనని!

సీ॥ ఈవిద్యపాత్రమ్ము ♦ లింటికిం గొనిపోయి
యెండలో సఖులు ప♦ఠించుచుంద్రు
నీసన్నిధికి వచ్చి ♦ నిత్యంబు పత్రికల్
ముదమంది పూరుషుల్ ♦ జదువుచుంద్రు
ఏ మహాసభ నేని ♦ యిచ్చోటనే సల్పి
పౌరులు సంతృప్తి ♦ వడయుచుంద్రు
ఏ మహాత్ముడుకూడ ♦ నీపురి కరుదెంచి
నిన్ను గూర్చియె చాల ♦ సన్నుతించు
గీ॥ అనుదినమ్మును విద్యార్థు ♦ లాసపడెదు
జ్ఞానఫలముల నిడు కల్ప♦శాఖ వగుచు
మించ జగదేకసత్కీర్తి ♦ గాంచితమ్మ
రామమోహన లైబ్రరీ♦నామ జనని!

సీ॥ ఆంగ్లభాషపఠించి ♦ ఆరితేరిన న్యాయ
వాదులకు న్యాయ♦వాదియయ్యె
జ్యోతిషపండిత♦చర్చలం జర్చించి
నేర్పరియై మేటి♦తీర్పు దీర్చె
కులగోత్ర గరిమంబు ♦ దెలియ వైశ్యాళికి
ధర్మదీపికనొండు ♦ తగ రచించె
విద్వజ్జనుల్ కవుల్ ♦ వేయినోళ్ళ నుతింప
దేవిభాగవతంబు ♦ తెనుగుజేసె
గీ॥ ధీరు డనగను సుందరా♦కారు డనగ
నిపుడు ఛాయాపటాకృతి ♦ నెలమి నిలిచె
దాసు శ్రీరామపండిత♦ధన్యుడిందు
రామమోహన లైబ్రరీ ♦ నామ జనని!

సీ॥ ఒకపూట సత్కళా • యుతులైన పండిత
సద్గోష్ఠిచే ప్రొద్దు • జరపియుంట
ఒకనాడు సత్కవి • ప్రకరముల్ మెచ్చగా
స్వీయకృతుల్ విన్కి • చేసియుంట
ఒకవేళ మిత్రులతో • సుద్యోగసమితితో
ముచ్చట్లతో ప్రొద్దు • పుచ్చియుంట
ఒకట జమీందారు • లురుభక్తి నరుదెంచి
అడిగిన సలహాల • నుడివియుంట
గీ॥ పండితుండన, కవియన, • పంతు లనగ
రావన, యమాత్యుడన జనుల్ • వేవిధాల
పలుకఁ దగి నాసు శ్రీరామ • పండితుండు
కీర్తితోడ ఛాయాపటా • కృతిని వెలసె॥

సీ॥ అజ్ఞానతిమిరంబు • లడగింపజాలిన
యర్కబింబంబు గ్రం • థాలయంబు
ఆనందదాయక • మౌ ప్రసంగము సేయు
ఆప్తమిత్రంబు గ్రం • థాలయంబు
సంశయవిచ్ఛేద • సామర్థ్యముం గన్న
ఆచార్యకంబు గ్రం • థాలయంబు
గ్రంథరూపంబున • రహిఁ ప్రకాశించు వా
ణీలలామంబు గ్రం • థాలయంబు
గీ॥ అట్టి గ్రంథాలయంబుల • కన్నిటికిని
ఘనశిరోభూషణం బన • గ్రాలు రామ
మోహన గ్రంథనిలయంబు • బ్రోవుడయ్య
పరమకృపతోడ బెజవాడ • పౌరులార!

—ప్రతాప వేంకటేశ్వరకవి.

(2)

మనుజధర్మాభిరతుల్ ప్రపూర్ణ ఫలితోద్భూత ప్రమోదాంత రా
త్మ నిగూఢాంచితులై కళానిరతులై స్థాపించి రీదివ్యసీ
మను విద్యాసముపార్జనార్థిజన సంపన్మూల మీ రామమో
హన గ్రంథాలయముల్ కృతజ్ఞులము మేమవ్వారి కవ్వారిగన్.
ఇరువది యించుమించుగ గడించు వసంతము లస్న ప్రియపు
న్బురువము సూపఁబోదని తనంత నలంకృతశూన్యయై దిగం
బరయయి దృష్టికానని యుపాస్యనిధిన్ బరితాపమిచ్చు, ఉ
ద్ధరణకళా ప్రదీపకుమత మ్మది చూచియుటంచుఁ దోచెడిన్.

పాడిబాన గ్రంథాలయ మేరు నిల్పి
నారొ? దివ్యముహూర్తమ్మునందు దొల్లి;
నాటగోలె సుధాపరిపూర్ణమ్ము గాఁగఁ
దనరినది నేటిదనుక — మీఁదట నెటుండొ?

తమ ప్రేమైక సుధార్ద్రమానసము సద్ధర్మ ప్రతిష్ఠాపకా
ర్యములం దాసవహించు నంచుఁ బలుకన్ బ్రాల్మాలగా నేల? స
ర్వము దేశార్పణజేయు-సంస్థ యిది మీ వాదోడు చేదోడుకై
మమతన్ గోరె; త్వదీప్సితమ్మును ఫలింపన్ జేతె నాగేశ్వరా!

దేశోద్ధారక గ్రంథమాలలు జగద్విఖ్యాతమై యొప్పఁగా
దేశోద్ధారక పాఠశాలలు భవద్దివ్యన్మహౌదార్య రా
కాశుభ్రప్రభ లల్లగా మనము వేడ్కన్ జెందగానీక ఓ
దేశోద్ధారక! సంచరించుటది నీకిన్ లక్ష్యమై యొప్పదే!

పలుపురు ధార్మికోత్తముల ప్రాపున నాకృతి దాల్చి, పూర్తి కా
వలసిన భాగ్యరేఖ తమపై నిడె నీ గృహలక్ష్మి; సంతతో
జ్జ్వలకవితావిహారుల ప్రసన్నమనోహర రూపమై జగ
ద్విలసితమై తలిర్చ నెటు దిద్దెదవో కా రమాధురంధరా!

సౌధరాజమ్ము లాంధ్రభూస్థలినిఁ జాటు
భవ దుదార నామాంకిత ప్రతిభ - అందు
రామమోహనగ్రంథాలయామతల్లి
ఒకటె చాలు నీ దానవిస్మృతికిఁ దోడు.

వేడికొనంగ నీయఁ దల పెట్టెదు ధర్మపరుల్ గలారుగా
కేడను వేడికోక మును పే గ్రహియించుచు నర్థి కీయు మీ
జాడలు శాశ్వతాంకిత విశాల వ్యాదంతరదీప్తికిఁ కళా
పౌర్ణిమ జూపు జూడగలవారలు గల్గిన దానవర్థితా!

ఆదిభిక్షుకుం డవార్యసన్నుతిగను
ధనదుఁడవని యర్థిజనము సేరు;
ధర్మసంస్థ యిద్ది ధర్మపరుండవు
ధర్మ మడుగ నేల దలఁచెదొకొ?

—తుర్లపాటి గోవర్ధనరావు.

# మదరాసు గ్రంథాలయసంఘము.

ఈ సంఘముయొక్క ప్రథమవార్షిక నివేదిక చేరినది. 1927 సంవత్సరమున డిశంబరు నెలయందు మదరాసునగరమున అఖిల భారత గ్రంథాలయసభ జరిగినదిగదా. ఆసభాఫలితముగ మదరాసు గ్రంథాలయ సంఘమును స్థాపించుటకుగాను అఖిల భారత గ్రంథాలయ సంఘ కార్యదర్శి యగు అయ్యంకి వేంకటరమణయ్యగారు కె. వి. కృష్ణస్వామి అయ్యరుగారి ఇంటియందు ఒక సమావేశమును సమకూర్చిరి. ఆసమావేశ ఫలితముగ ఈసంఘము ఏర్పడినది.

ఇప్పు డీ సంఘమునందు 417 మంది సభ్యులు గలరు. మదరాసునందు కార్పొరేషను వారిచే ధర్మగ్రంథాలయములు పెట్టించుటకై ప్రయత్నములను జేసిరి. మునిసిపాలిటీలను, లోకలుబోర్డులను ధర్మగ్రంథాలయములను స్థాపించవలసిన దని కోరిరి. డిండిగలు, కర్నూలు పాలంకోట మ్యునిసిపల్ సంఘములు ధర్మగ్రంథాలయములను స్థాపించుటకు తీర్మానములను జేసినవి. రామనాథ తాలూకాబోర్డువారు గ్రామ గ్రంథాలయములకు దోడ్పడుచున్నారు. చెంగల్పట్టు డిస్ట్రిక్టు బోర్డువారు గ్రామగ్రంథాలయ పద్ధతిని స్థాపించిరి. దేశభాషలందలి గ్రంథముల పట్టికలను తయారుజేయుటకై అరవము, కన్నడము, మళయాళము, ఆంధ్రము, ఉర్దూ భాషలకు వేర్వేరు ఉపసంఘములను నియమించిరి. అరవ మళయాళ భాషలకు పట్టికలు పూర్తిగావచ్చినవి. అవి పూర్తికాగానే ప్రకటింపబడగలవు.

మదరాసునందు కేంద్ర గ్రంథాలయము నొకదానిని స్థాపించుట అనసరమని కనిపెట్టబడినది. దానికి ఫలితముగ మదరాసునందున్న కన్నెమెరాగ్రంథాలయమును కేంద్రగ్రంథాలయముగా మార్పించు ప్రయత్నములు జేయబడుచున్నవి. గ్రంథాలయాభిప్రాయమును వ్యాపింప జేయుటకుగాను 10 మహాజన సభలు సమకూర్పబడెను.

కలకత్తాయందు జరిగిన 6 వ అఖిల భారత గ్రంథాలయసభకు ఒక ప్రతినిధిని పంపిరి.

ఈ వత్సరమందు రూ 5,972-9-2 లు వసూలయ్యెను. ఖర్చు రు **313-14-0** మాత్ర మయ్యెను.

## శ్రీఆంధ్ర మహాజనసంఘము, మోల్మేన్. (బర్మా)

ఈపురమున ఆంధ్రమహాజనసంఘము నాల్గేండ్లక్రిందట స్థాపించబడి సర్వాంధ్రజనోపయోగార్థమై పాటుబడుచున్నది. ప్రస్తుతము సంఘముయొక్క పోషణక్రింద ఒక పగటిపాఠశాల, ఒక రాత్రిపాఠశాల, ఒక పుస్తకభాండాగారము నిర్వహింపబడుచున్నవి. పుస్తకభాండాగారము దినదినప్రవర్థమానమై పెక్కుమంది చదువరుల నాకర్షించుచున్నది. ఐదువందల ఆంధ్రాంగ్లేయ గ్రంథములు గలవు. 20 పత్రికలు వచ్చుచున్నవి.

ఈసంఘాధ్యక్షులైన పరిమి సోమరాజుగారు రెండువందలరూపాయలకుపైగా విలువగల మూడు అద్దపుబీరువాలను, కుర్చీలను, పెద్ద గోడగడియారమును దానము గావించిరి. పలువురు గ్రంథాలయాభిమానులు విరివిగా గ్రంథముల నొసంగి సహాయము చేసిరి. అభిమానులెల్లరను ప్రోత్సాహపరచుచున్నాము.

—పోతుల సుబ్రహ్మణ్యం, లైబ్రేరియన్.

## శ్రీ వివేకానంద గ్రంథాలయము, అనంతవరం.

గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా అనంతవర గ్రామమునందు ది 15-6-1925 తేదీన "శ్రీ వివేకానంద గ్రంథాలయము" స్థాపింపబడినది. ప్రప్రథమమున 250 గ్రంథములతో స్థాపింపబడి నేటికి షుమారు 1000 గ్రంథరాజములతో విరాజిల్లుచున్నది. నాలుగు పెద్ద యద్దపు బీరువాలు గలవు. 17 పత్రికలు వచ్చుచున్నవి. 20 మంది చందాదారులు గలరు. వారివలన నెలకు రు 10 లు వసూలగుచున్నవి.

గ్రామమునుండి ఎగుమతి అమ్మకపు సరకులమీాద సంవత్సరమునకు షుమారు రుసుము రు 200 ల వరకు వచ్చుచుండును. చందాధనము పత్రికలు తెప్పించుటకును, రుసుములవలన వచ్చు నాదాయము గ్రంథములు తెప్పించుటయందును వినియోగింపబడు చున్నది. గ్రంథాలయమునకు వచ్చు నాదాయము నుండి యవసరమగుచో ధర్మకార్యములకు కూడ వినియోగింపబడుచున్నది. 1927 సంవత్సరమున యీగ్రామమున కలరా వ్యాధి వ్యాపించి జనులను తల్లడిల్లజేసిన సమయమందు గ్రంథాలయము తరఫున రు 100 లను వెచ్చించి మందులను తెప్పించి ప్రజలకు ఉచితముగా నొసంగబడినవి. ఇట్లు మందుల నొసంగుటలో రాత్రియనక, పవలనక భయమనక, త్యాగమును చూపి శ్రద్ధతీసికొనిన శ్రీయుత కె. వి. సుబ్బారావుగారు ప్రశంసాపాత్రులు.

గ్రంథాలయమునందలి గ్రంథములను సమీపగ్రామస్థులకును, గ్రామస్థులకు శ్రీ [illegible] విచక్షణతోనే యుచితముగ నొసంగబడును. గ్రంథాలయమునకు వసతిగృహము నొసంగిన కుందా వెంకటసుబ్బయ్య శాస్త్రిగారు వందనీయులు. గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడుచున్న ప్రముఖులు శ్లాఘాపాత్రులు.

-పోలూరు సుబ్రహ్మణ్యం.

## శ్రీసరస్వతీ నిలయము, తిరుత్తణి. (చిత్తూరుజిల్లా)

ప్రజలయందు విజ్ఞానోత్తేజములను గలిగించుటకు ముఖ్యసాధనములు పుస్తకభాండాగారములని చెప్పక తప్పదు. అట్టి పుస్తకభాండాగారములు దేశమందనేకములుగా విలసిల్లుచు మానవసేవ గావించుచున్నవి. ఈ యూరియందును అట్టి సత్సంకల్పముతో శ్రీ సరస్వతీ నిలయమనుపేర నొకగ్రంథభాండాగారము నెలకొల్పబడి సాగింపబడు

చున్నది. భగవత్సన్నిధానములగు దేవాలయము లెట్లు మనకు ప్రార్థనా మందిరములై భక్తి మోక్షసామ్రాజ్యముల నొసగుచున్నవో యట్లే గ్రంథభాండారములుకూడ సరస్వతీమందిరములై ప్రజాళికి విజ్ఞానసిరి సంపదలను సమకూర్చుచున్నవి. ఆంధ్రాంగ్లద్రావిడ గ్రంథములు 600 వరకు గలవు. భాషాభిమానులగు కొందరు యుదారభావముతో కాలడిగ మాసచందాల నిచ్చియు గ్రంథములను, వార్తాపత్రికలను నుచితముగ నిచ్చియు నాదరించుచున్నారు. గ్రంథాలయమును సక్రమ పద్ధతులతో సాగించుటకు ప్రస్తుత మందు సాధనసంపత్తి చాలక యున్నది. అందరు సహాయము చేయ ప్రార్థితులు.

—బూదూరు రామానుజులు రెడ్డి.

## ఉచితము.

నాచే రచింపబడిన 0-8-0 విలువగలిగిన 'నిర్మలానంద' మను శాంతరసప్రధాననాటకమును గ్రంథాలయములకును, విద్యార్థులకును ఉచితముగ నొసంగుచున్నాను. కావలసినవారు క్రింది చిరునామకు ఖర్చుల నిమిత్తం రు. 0-2-6 తపాల బిళ్ళలను బంపవలెను.

అడ్రసు:—

బులుసు వేంకటరమణయ్య,
రామతీర్థము. (Via) నెల్లిమర్ల,
విశాఖపట్టణంజిల్లా.